# గాయత్రీ మంత్రము



వివరణము

**డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి**, M.Sc., M.Phil., Ph.D.
(రిటైర్డ్) రీడర్ & భౌతికశాస్త్ర విభాగాధ్యక్షులు
టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు



**జగద్గురు పీఠము - గుంటూరు శాఖ**
(The World Teacher Trust - Guntur Branch)
గుంటూరు - 522 002
ఫోన్ : 233995

# గాయత్రీ మంత్రము

ప్రథమ ముద్రణ డిశెంబరు 1983

షష్ఠ ముద్రణ (విస్తరించబడినది) 1997

సప్తమ ముద్రణ ఆగస్టు 2000



ప్రతులకు

1. **డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి**

   5-10-4, 2/9, బ్రాడీపేట

   గుంటూరు - 522 002

   ఫోన్ నెం. (0863) 233995

2. **ది వరల్డ్ టీచర్ ట్రస్ట్**

   45-40-36/1

   అక్కయ్య పాలెం

   విశాఖపట్టణము - 530 016

**వెల : రు.10/-**

ముద్రణ : విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,

గుంటూరు -2, ఫోన్ : 242345

# ముందుమాట

గాయత్రీ మంత్రమునందు ఎక్కువమందికి అభిమానము ఉన్నంతగా కనువిప్పు ఉండదు. సామాన్య స్థాయిలోని మానవునికి గూడా కనువిప్పు కలుగునట్లు తేలికగాఅర్థమగు దైనందిన జీవితములోని ఉదాహరణలతో గాయత్రీపరమైన విషయములు ఈ పుస్తకములో వివరింపబడినవి.

ఈ పుస్తకము మొట్టమొదటగా 1983 డిశెంబర్ నెలలో ముద్రణకు నోచుకున్నది. అటుపైన 1985 జనవరిలోను, 1991 జనవరిలోను మరల మరల ముద్రింపవలసిన ఆవశ్యకత ఏర్పడినది. ఈ పుస్తకముపై పాఠకులకు కలిగిన అభిమానమే ఇందులకు తార్కాణము.

ఇది చిన్న పుస్తకమైనను గాయత్రిని గురించి అవసరమైన ప్రాథమిక విషయములన్నియు ఇందు పొందుపరచడమైనది. ఇంతకు పూర్వము ముద్రింపబడిన ఈ పుస్తకములోని విషయములు ఈ ప్రస్తుత ముద్రణలో బాగుగా విస్తరింపబడినవి. "గాయత్రీ మంత్రము"పై నేను గోదావరీ పుష్కరముల సందర్భములో రాజమండ్రిలో ప్రసంగించిన విషయములను, గుంటూరు విశ్వమందిరములో ప్రసంగించిన విషయములను - వినినవారిలో చాల మంది విన్నతరువాత "గాయత్రీ మంత్రముపై మీరు ప్రసంగించిన విషయములు హేతువాదబద్ధముగా, సశాస్త్రీయముగా నున్నవి. ఈ విషయములు మీరు వ్రాసిన గాయత్రీ పుస్తకములో లేవు. ఈ సారి ముద్రించునపుడు ఈ విషయములు గూడా చేర్చిన బాగుండును గదా!" అని చక్కని సలహానిచ్చిరి. వారి సలహా మేరకు ప్రస్తుత ముద్రణలో అవి చేర్చబడి పుస్తకము విస్తరించబడినది.

గాయత్రీ వైశిష్ట్యమును గూర్చి చెప్పిన ఆర్షసూక్తులు; ఉపనిషత్తులు, ఋషులు, మహర్షులు - చెప్పిన శ్లోకములు, వాటి భావములు గూడా పొందుపరచబడినవి. మంత్రము, గాయత్రి, ప్రార్థన, జపము, ధ్యానము మొదలైన పదముల గూర్చి చర్చించబడినది. గాయత్రీ మంత్రములోని అక్షరములసంఖ్య, గాయత్రీమాతయొక్క పంచశీర్షముల ప్రాముఖ్యము మానవ ప్రయత్న, దైవానుగ్రహముల ఆవశ్యకత ఇందు ప్రస్తావింపబడినవి. ఈ విషయములన్నియు తేలికగా అర్థమగుటకు వీలగు భాషలోనే వ్రాయబడినవి. గాయత్రిపై ఆసక్తి, ఆదరము, ఆరాధనాభావము కలిగిన వారందరికీ ఈ పుస్తకము హస్తభూషణము మరియు మస్తకభూషణము గూడా అగునని నా నమ్మకము. పాఠకులు చదివి, విషయమును గ్రహించి ఆనందించవలసినదిగా నా ప్రార్థన.

నా బుద్ధిని ప్రచోదనము చేసిన గాయత్రీ మాతకు, వ్రాయుటకు కావలసిన జ్ఞాన సంపత్తిని ప్రసాదించిన గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి నా సాష్టాంగ దండ ప్రణామములు. నా ప్రసంగ విషయములను జేర్చి పుస్తకమును విస్తరింప జేయవలసినదని సలహా ఇచ్చి ప్రోత్సహించిన సహృదయ స్నేహితులకు, సోదర, సాధక, పాఠకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. వీరందరూ ఆనందమయ జీవితమును గడుపుటకు కావలసిన ఆయురారోగ్యైశ్వర్యాలను వారికి గాయత్రీ మాత అనుగ్రహించు గాక !

గుంటూరు

1-9-97

-జి.ఎల్.ఎన్.శాస్త్రి

# కృతజ్ఞతలు

జగద్గురు పీఠం గుంటూరు శాఖ నిర్వహించే కార్యక్రమాలన్నిటికీ తమ విశాల గృహ ప్రాంగణాన్ని అందుబాటులో ఉంచి సహకరించడమే కాకుండా, ప్రచురించే ఆధ్యాత్మిక గ్రంథాల ముద్రణకు గూడా తగిన విధంగా ప్రోత్సాహాన్ని - శ్రీ దేశిరాజు పార్థసారధి, శ్రీలక్ష్మిదంపతి - అందిస్తున్నారు. 'గాయత్రీ మంత్రము' పుస్తకాలు పునర్ముద్రితం కావాలనంగానే - సింగపూర్‌లో నివసిస్తూ, వృత్తిని నిర్వహించే - వారి ద్వితీయ కుమారుడు - చిరంజీవి రవిశంకర్ ఈ 'గాయత్రీ మంత్రము' పుస్తక సప్తమ ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించాడు. అతనికి హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

చిరంజీవి రవిశంకర్‌కు; అతని తల్లిదండ్రులు శ్రీమతి శ్రీలక్ష్మి శ్రీ పార్థసారధి దంపతికి; అతని సహధర్మచారిణి చి.ల.సౌ. లక్ష్మిప్రసన్నకు; వీరి పిల్లలు చి.సౌ.వైష్ణవి, చిరంజీవి కిరీటిలకు; చి.సౌ. లక్ష్మిప్రసన్న తల్లిదండ్రులు, జంగారెడ్డిగూడెం వాస్తవ్యులు అయిన - శ్రీమతి బసవరాజు రామలక్ష్మి, శ్రీ లక్ష్మణరావు దంపతికి - శ్రీ గాయత్రీ మాత పరిపూర్ణ అనుగ్రహం కలిగి, అందఱూ సంపూర్ణ ఆయురారోగ్యైశ్వర్యాలతో వర్ధిల్లాలని గాయత్రీ మాతను ప్రార్థిస్తున్నాను.

గుంటూరు,
14.8.2000
(శ్రావణ పూర్ణిమ)

ఇట్లు
**జి.ఎల్.ఎన్.శాస్త్రి**
(ఈ పుస్తక వివరణ కర్త)

# గాయత్రీ మంత్రము

భారతదేశమున పూర్వకాలములో ముఖ్యముగా ఐదు విధములైన దేవతారాధనలు ఉండెడివి. అవి 1) గాణాపత్యము 2) సౌరము 3) శాక్తేయము 4) శైవము 5) వైష్ణవము. గాణాపత్యులు- గణపతిని; సౌరులు - సూర్యుని; శాక్తేయులు - శక్తిని; శైవులు - శివుని; వైష్ణవులు - విష్ణువును ఆరాధించెడివారు. వీరిమధ్య పరస్పర అవగాహన కన్న పరస్పరవిద్వేషమే అధికముగా ఉండెడిది. ఒకరి దేవతను ఇంకొకరు ఆరాధించరు. కాని, వీరందరూ ఆరాధించుటకు అభ్యంతరము లేని ఒకే ఒక దేవత "గాయత్రి". అట్టి వైశిష్ట్యము గాయత్రీ మాతకు ఉన్నది. (దీనికి కారణము గాయత్రీ ధ్యానమునకు సంబంధించిన "ముక్తా విద్రుమహేమనీల ధవళచ్ఛాయైః ముఖైః" అన్న శ్లోకములో చెప్పిన పంచవర్ణముల పంచముఖములను ఈ ఐదు దేవతలకు ప్రతీకలుగా తీసికొనినపుడు పరస్పర విద్వేషము తొలగి సమన్వయము, అవగాహన పెరుగుట వలననేమో ! ఈ విషయము ముందు ముందు వివరించ బడును.) ఋషులు, మహర్షులు, పురాణోపనిషత్తులు తెలుపు ఈ క్రింది శ్లోక పాదములను బట్టి గాయత్రీ వైశిష్ట్యము మరింత స్పష్టమగును.

# గాయత్రీ వైశిష్ట్యము

శ్లో॥ గాయత్రీం చింతయేద్యస్తు హృత్పద్మే సముపస్థితాం ।
ధర్మాధర్మ వినిర్ముక్త స్సయాతి పరమాంగతిమ్ ॥

-వేదవ్యాసుడు

భావము : గాయత్రిని హృదయములో ఉపాసించువాడు లేదా ధ్యానించువాడు ధర్మాధర్మ విచికిత్స చేత బంధింపబకుండ మోక్షమును పొందును.

శ్లో ॥ గాయత్రీ వేదజననీ గాయత్రీ లోకపావనీ ।
న గాయత్ర్యాః పరం జప్యం, ఏతద్విజ్ఞాన ముచ్యతే ॥

- కూర్మ పురాణము

భావము : గాయత్రియే వేదమాత, త్రిలోకవాసులకును జ్ఞానమును ప్రసాదించు పావని. సర్వోత్కృష్టమైన గాయత్రీమంత్ర జపమును మించినది మరియొకటి లేదు.

శ్లో ॥ గాయత్రీంచైవ వేదాంశ్చ తులయో సమతోలయన్ ।
వేదా ఏకత్ర సాంగాస్తు గాయత్రీ చైకత స్థితా ॥

-యాజ్ఞవల్క్యుడు

భావము : నాలుగు వేదములను, ఆరు వేదాంగములను త్రాసు యొక్క ఒక పళ్ళెమునందు, గాయత్రీ మంత్రమును రెండవ పళ్ళెము నందు ఉంచి తూచినచో గాయత్రి వైపే త్రాసు మొగ్గు చూపును.

శ్లో ॥ న గాయత్ర్యాః పరమ్ మంత్రం నమాతుః పరదైవతమ్॥

-అర్షసూక్తి

భావము : తల్లిని మించిన దైవము, గాయత్రిని మించిన మంత్రము లేవు.

చత్వారో వేదాస్సాంగా ఉస్యో పనిషదస్సేతిహాసాః

సర్వేగాయత్ర్యాః ప్రవర్తంతే"

-గాయత్రీ ఉపనిషత్తు

భావము : వేదము, వేదాంగములు, ఉపనిషత్తులు, ఇతిహాసములు అన్నియు గాయత్రి వలననే ప్రవర్తించును.

శ్లో॥ గాయత్రీ మాత్రనిష్ఠస్తు కృతకృత్యో భవేద్విజః

-గాయత్రీ రహస్యం

భావము : ఒక్క గాయత్రీ మంత్రమును ఉపాసించిననూ ఇతర ఉపాసనలతో ప్రమేయము లేకనే ద్విజుడు కృతార్థుడగును.

శ్లో॥ సర్వాత్మనాహి యాదేవీ సర్వభూతేషు సంస్థితా ।

గాయత్రీ మోక్షహేతుర్వై మోక్షస్థానక లక్షణమ్ ॥

- ఋష్య శృంగుడు

భావము : సర్వభూతముల యందు అంతర్యామినియై వర్తించు గాయత్రియే మోక్షస్వరూపము, మోక్షప్రసాదిని అయివున్నది.

శ్లో॥ యావేదాదిషు గాయత్రీ సర్వవ్యాపీ మహేశ్వరీ ।
ఋగ్యజుస్సామాధర్వైశ్చ తన్మేమనశ్శివ సంకల్పమస్తు ॥
-మహన్యాసమ్

భావము : అన్ని వేదములలో ప్రతిపాదింపబడిన గాయత్రి సర్వ మానవుల బుద్ధులయందు మంగళకరములైన సంకల్పములను కలిగించును.

## ఇతర మంత్రములకన్న గాయత్రి ఏల విశిష్టమైనది ?

ఏ మంత్రమైనను బుద్ధి జీవి అయిన మానవునకు మాత్రమే ఉపయోగపడును. బుద్ధిని పెట్టి మననము చేసినపుడే మంత్రమగును. బుద్ధిని ఉపయోగించి ఉచ్చరించిన అక్షరము బీజాక్షరమగును. బుద్ధిని ఉపయోగించకుండా ఉచ్చరించినచో మామూలు అక్షరమగును.

ఉదా: "క్రీం" అనునది కాళికాదేవికి సంబంధించిన ఒక బీజాక్షరము. వేసవికాలములో "ఐస్‌క్రీం"ను వీధులలో అమ్ముకొనువాడు ఈ "క్రీం" అను అక్షరమును రోజుకు కనీసము ఒక వెయ్యి పర్యాయము లైనను ఉచ్చరించును. అయినను ఆ అక్షరము అతనిపట్ల బీజాక్షరమవదు. బుద్ధిపెట్టి లేదా బుద్ధిపెట్టి ఉచ్చరించునపుడు మాత్రమే అది బీజాక్షరమై కాళికాదేవితో సంబంధమేర్పడును. ప్రెస్‌లో మంత్రశాస్త్రము అచ్చువేయవలసి వచ్చినపుడు "క్రీం" అను అక్షరమును కంపొజిటర్, ప్రూఫ్ రీడర్ కూడా ముట్టుకొనుట, చదువుట చేయుదురు. అయినను అది

వారి పట్ల బీజాక్షరముగా పనిచేయదు. కాబట్టి, మంత్రాక్షరము బీజాక్షరమగుటకు, మంత్రము వలె పనిచేయుటకు బుద్ధి అవసరమని తెలియుచున్నది. ఈ బుద్ది గూడా పెడత్రోవ త్రొక్కనిదై వుండవలెను. బుద్ధులు పెడత్రోవ త్రొక్కకుండా ప్రచోదనము చేయునది గాయత్రి. కాబట్టి, ముందుగా ఈ సద్బుద్ధికై "గాయత్రి" పఠించి అటుపైన పొందిన సద్బుద్ధితో మిగిలిన ఇతర మంత్రములను పఠించిన ఫలితము చేకూరును. ఈ కారణము వలన మిగిలిన మంత్రములకన్న ముందుగా గాయత్రి చేయవలెనని చెప్పుట జరిగినది. అంతేగాని 'గాయత్రి ఒక్కటియే మంత్రము, మిగిలిన మంత్రములు పనికిరానివి' అని అర్థము కాదు.

అదే విధముగా తల్లిని దైవముగా ఆరాధించిన తరువాత మిగిలిన వారిని ఎవరినైనను ఆరాధించినచో ఫలితము ఉండును. దైవముగా చూడవలసిన వారిలో మాతృమూర్తికే ప్రథమ స్థానము. ఆ తరువాతనే తండ్రి, గురువు (మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ - అని వరుసలో తైత్తిరీయోపనిషత్తు చెప్పును.) ధ్యాన, జప, స్తోత్ర, సంకీర్తన, పూజాదులలో ఏది చేయవలెనన్ననూ పంచ జ్ఞానేంద్రియములతో కూడినదేహముతోనే గదా ! అట్టి దేహమును ఎవరికైనను ఇచ్చునది తల్లియే గదా! అందువలన ప్రతి జీవి ముందు తల్లిని దైవముగా ఆరాధించిన తరువాతనే మిగిలిన వారిని ఆరాధించినచో సబబుగా ఉండును. అందుచేతనే మంత్రములలో గాయత్రిని తల్లితో పోల్చిరి. తల్లి పిల్లవానిని నవమాసములు గర్భములో మోసి, కని, వడిలో

పెట్టుకొని, పాలిచ్చి, పెంచి, పోషించి, రక్షించి, పెద్దవానిని జేయును. గాయత్రీ మాత గూడా ఉపాసకుని అదే విధముగా కాపాడును. ఈ కారణము వలననే -

"న గాయత్ర్యాః పరమ్ మంత్రమ్ (పరోమంత్రః)
న మాతుః పరదైవతమ్"

అని ఆర్యులు చెప్పిరి.

## మంత్రము

"మననాత్ త్రాయతే ఇతి మంత్రః" అనగా 'మననము చేసిన కొలది రక్షించునది మంత్రము' అని భావము. 'మాట'ను ఒకసారి ఉచ్చరించిన సరిపోవును గాని, 'మంత్రమును' ఒకసారి ఉచ్చరించిన చాలదు. మనస్సుతో పదే పదే మననము చేయవలయునని దీనిని బట్టి తెలియుచున్నది. ఇట్లు మననము చేయుటనే జపము అందురు. 1) భజన, సంకీర్తన, స్తోత్రములను నోరార గొంతెత్తి ఉచ్చరించవచ్చును. 2) జపము నిదానముగా, మెల్లగా, తక్కువ స్థాయిలో జరుగపలెను. 3) ధ్యానము మౌనముగా జరుగవలయును. మనస్సు గలిగి, మననము చేయగలిగి, ఆసక్తి గలిగిన వారందరూ ఈ మంత్రములను చేయవచ్చునని మంత్ర పద నిర్వచనము, వ్యుత్పత్తి అర్థములు చెప్పుచున్నవి.

మంత్రమునకు మనస్సుపైనను, మనస్సునకు పదార్థమయమైన జగత్తు, దేహముల పైనను ప్రభావము ఉండును. మాటకన్న మెరుగైనది మంత్రము. ఈ విషయము ఈ క్రింద ఉదహరించిన

"మీ మాటలు మంత్రమ్ములు
మీ మెట్టిన యెడ ప్రయాగ"

- మనుచరిత్ర

'మీ మాట మా వాడి మీద మంత్రంలా పనిచేసింది"

అను ప్రయోగములు స్పష్టపరచును. "నిమ్మకాయను రెండు చెక్కలుగా కోసి; ఒక చెక్కను పిండుతుంటే రసం...." అని ఇంకనూ ఏదో చెప్పబోవు చుండగనే ఈ మాటలు - వినువాని మనస్సుపై పనిచేసి, నాలుకపై నీళ్ళను ఉత్పత్తి చేసి ఊరించును. దీనిని బట్టి మనస్సునకు పదార్థమును సృష్టింప చేయుశక్తి వున్నట్లు తెలియుచున్నది గదా! ఒట్టి సాదా మాటలకే ఇంతటి శక్తి వున్నపుడు - మాటల కన్న మెరుగైన మంత్రములకు తప్పనిసరిగా ఎక్కువ శక్తి వుండునని గ్రహించవలెను.

త్రికరణ శుద్ధిగా, అనగా - మనసా, వాచా, కర్మణా, జరుగు పనులకు ఎక్కువ సిద్ధి చేకూరును. పసిపిల్ల వానిని నిద్రింప జేయుటకు- పిల్లవానిని మెత్తని పొత్తిళ్ళలో పరుండ బెట్టి, ప్రక్కను ఊయలలో ఏర్పాటు జేసి, ఆ ఊయెలను జాయగా ఊపుచూ, ఊపుచున్నపుడు దానికి తగిన రీతిలో ఆనందభైరవి వంటి రాగములతో జోలపాటను - రాగ, తాళ, లయాత్మకముగా పాడినచో - ఆ పిల్లవాడు త్వరగా నిద్రించుటకు ఎక్కువ అవకాశము వుండును గదా ! అదేవిధముగా మంత్ర జపములో గూడా జరిగినచో ఆ మంత్రజపమునకు ఎక్కువ సిద్ధి చేకూరును.

## గాయత్రి

"గాయంతాం త్రాయతే ఇతి గాయత్రి" అనగా గానము చేయు వానిని రక్షించునది గాయత్రి - అని భావము. గానము చేయుట అనగా గొంతెత్తి బిగ్గరగా రాగ, భావ, శ్రుతి, లయ బద్ధముగా పాడుట గాని - నసుగుతూ, సణుగుతూ వినబడీ వినబడనట్లు ఉచ్చరించుట కాదు. కాబట్టి - గాయత్రి మంత్రమును గొంతెత్తి బిగ్గరగా గానము చేయవచ్చునని గాయత్రీ పద నిర్వచనము, వ్యుత్పత్తి అర్థములు చెప్పుచున్నవి. మరియు, ఇది స్వరయుక్త మంత్రము. వైఖరీ వాక్కుతో పైకి ఉచ్చరించినపుడే స్వరబేధము స్పష్టముగా తెలియును కాబట్టి గాయత్రిని సుస్పష్టముగా, స్వరయుక్తముగా గొంతెత్తి ఉచ్చరించవచ్చును.

మననము చేసిన కొలది రక్షించునది - "మంత్రము". గానము చేసిన కొలది రక్షించునది "గాయత్రి". అనగా మంత్రము యొక్క అర్థము, గాయత్రి యొక్క అర్థము ఒక్కటే ! 'మంత్రము' 'గాయత్రి' పదములలో గల "త్ర" అను అక్షరము ఉండుటయే దీనికి గల కారణము. అనగా గాయత్రి నూటికి నూరుపాళ్ళు మంత్రము అని దీనిని బట్టి తెలియును.

## ప్రార్థన

ప్ర + అర్థన = ప్రార్థన. ప్ర - అనగా చక్కగా, అర్థన - అనగా అర్థించుట కాబట్టి, 'ప్రార్థన' అనగా 'చక్కగా అర్థించుట' అని అర్థము. అర్థించుటను సూచించు పదములు ఒక అర్థవంతమైన వాక్య

నిర్మాణమును రూపొంది వున్నచో అది ప్రార్థన అగును. ఉదా: 'నమోనారాయణాయ' అనగా "నారాయణుని కొఱకు నమస్కారము", "నమశ్శివాయ" - "శివుని కొఱకు నమస్కారము" అను విధముగా అర్థవంతమైన వాక్యనిర్మాణము గల ఈ మంత్రములు ప్రార్థనలు గూడా అగును. "క ఏ ఈ ల హ్రీం ! హ స క హ ల హ్రీం ! స క ల హ్రీం" అను అమ్మవారి పంచదశాక్షరీ మంత్రములోని అక్షరములన్నియు బీజాక్షరములే! ఒక్కొక్క బీజాక్షరమునకు విడివిడిగా ఒక్కొక్క అర్థము వున్నది. అన్ని అక్షరములు మూడు కూటములుగా వున్నవి. ఈ అక్షరములు, ఆ కూటములు గూడ సంకేతములే ! అయిననూ మంత్రములో ఒక నిర్దిష్టమైన వాక్యనిర్మాణము లేదు. అందువలన ఇది మంత్రమగునే కాని ప్రార్థన కాదు. కాని, గాయత్రీ మంత్రములో నిర్దిష్టమైన అర్థవంతమైన వాక్య నిర్మాణము గలదు. "ఎవరు మా బుద్ధులను ప్రచోదనము చేయుచున్నారో - అట్టి సవితృమూర్తి యొక్క దివ్యమైన తెల్లని తేజస్సును మేము ధ్యానించు చున్నాము", అను చక్కని అర్థముతో వాక్య నిర్మాణమున్నది. ఒక నిర్దిష్టమైన అర్థము, అభ్యర్థనము వుండి ప్రార్థన, మంత్రము ఒక దానిలో ఒకటి అంతర్లీనమై వుండుటచే గాయత్రి - మంత్రము మరియు ప్రార్థన గూడా అగును.

మంత్రము, ప్రార్థన గూడా అయినటువంటి గాయత్రీ మంత్రము తెలుపు వివిధ అంశములు ఇక మీదట చర్చించబడును.

## గాయత్రీ మంత్రమునకు అక్షరములెన్ని ?

గానము చేయదగిన గాయత్రీ మంత్రములో రెండు విధములైన మంత్రములు గలవు. 1) విశిష్ట గాయత్రి 2) జప గాయత్రి

### 1. విశిష్ట గాయత్రి

విశిష్ట గాయత్రిలో ప్రణవము (ఓంకారము), సప్త వ్యాహృతులు, మూడు పాదములు, ప్రాణాయామమునకు సంబంధించిన చివరి మంత్రభాగము వుండును. వీటితో విశిష్ట గాయత్రి ఈ క్రింద తెలుపబడిన విధముగా నుండును.

"ఓం భూః । ఓం భువః । ఓగ్ం సువః । ఓం మహః । ఓం జనః । ఓం తపః । ఓగ్ం సత్యం । ఓం తత్సవితుర్వరేణ్యం । భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ । ఓమాపో జ్యోతీరసో౽మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్"

ఈ విశిష్ట గాయత్రిని ప్రాణాయామము నందు, ప్రాయశ్చిత్త అర్ఘ్య ప్రదానము నందు వినియోగించుదురు.

### 2. జప గాయత్రి

జప గాయత్రిలో ప్రణవము (ఓంకారము), మూడు పాదములు మాత్రమే ఉండును. ఈ జపగాయత్రినే సాధారణముగా గాయత్రీ మంత్రముగా వ్యవహరింతురు. ఈ జప గాయత్రీ మంత్రమును గూర్చియే

ఈ పుస్తకము నందు వివరణ ఇచ్చుట జరిగినది. ఈ జపగాయత్రి ఈ క్రింద తెలిపిన విధముగా నుండును.

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం । భర్గో దేవస్య

ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ ।

పైన తెలుపబడిన జప గాయత్రీ మంత్రములో మొత్తము 29 అక్షరములు లెక్కకు వచ్చును. మరి గాయత్రీ మంత్రములో 24 అక్షరములు (చతుర్వింగ్ంశత్యక్షరా) వుండును అందురు గదా ! మరి 29 వచ్చినవేమి ? పైన తెలిపిన మంత్రములో మూడు వ్యాహృతులు అనగా భూః, భువః, సువః, (కొందరు 'సువః' కు బదులు 'స్వః' అందురు. అయినను అర్థము మారదు.) అనునవి గాయత్రీ మంత్ర ప్రధాన భాగమునకు చెందవు. జప గాయత్రిలో గాయత్రీ మంత్ర ప్రధాన భాగము ఈ క్రింద తెలుపబడినది.

ఓం తత్సవితుర్వరేణ్యమ్ । భర్గో దేవస్య ధీమహి ।

ధియో యో నః ప్రచోదయాత్ ।

('ణ్యమ్'ను ఒకే అక్షరముగాను అట్లే 'యాత్'ను ఒకే అక్షరముగాను లెక్క వేయవలెను).

కొందరు 'ఓం'ను విడచి మిగిలిన దానిని గాయత్రీ మంత్రముగా చెప్పుదురు. అప్పుడు మంత్రమునకు 23 అక్షరములే వచ్చును. ఈ లోపమును పూరించుటకువారు "తత్సవితుర్వరేణియమ్ । భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ ॥" అని చెప్పుదురు. అనగా ఈ పద్ధతిలో "వరేణ్యమ్" అను పదమును 'వరేణియమ్' అని విడదీయుట జరిగినదన్నమాట ! ఇట్లు చేయు విధానము ఏదో కిట్టించిన విధానము (Manipulation)గా నున్నట్లు తోచును. అందువలన ప్రణవ పూర్వకముగా, అనగా "ఓం తత్సవితుర్వరేణ్యమ్ భర్గోదేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్।" అనునదియే 24 అక్షరముల ప్రధాన గాయత్రీ మంత్రముగా లెక్క పెట్టుకొనవలెను.

ప్రణవ పూర్వకముగా మంత్రములను చెప్పుట గూడ సంప్రదాయమే ('ఓం నమో భగవతే వాసుదేవాయ' (ద్వాదశాక్షరి) 'ఓం నమో నారాయణాయ' (అష్టాక్షరి) మొదలగునవి.) (ప్రణవ పూర్వకముగా చెప్పుటలో సిద్ధించు ప్రాముఖ్యము తరువాత సోదాహరణముగా చెప్పబడును).

## గాయత్రీ మంత్రమునకు 24 అక్షరములెందుకు వచ్చినవి ?

"ఉన్మేష నిమిషోత్పన్న విపన్నభువనావళిః"

- శ్రీ లలితాసహస్ర నామ స్తోత్రం

"జగన్మాత కనురెప్పలు తెరిచినపుడు జగత్తు సృజింపబడి, ఆమె కనురెప్పలు మూసినపుడు జగత్తు లయము చెందును" అని పై శ్లోక పాద తాత్పర్యము.

ఒకదాని తరువాత మరి యొకటి ఏకాంతరముగా అనగా, ఒకదాని తరువాత ఒకటి (Alternate) మారుతూ నిరంతరము జరుగు ప్రక్రియలలో మనము ఎఱుగున్నంత వరకు తక్కువ కాలవ్యవధిలో జరుగు ప్రక్రియ రెప్పపాటు. ఈ కాలవ్యవధినే ఆవర్తన కాలము (Time Period) అందురు. రెప్పపాటు ఆవర్తనకాలము కన్న రానురాను ఎక్కువ ఆవర్తన కాలములో జరుగు ప్రక్రియలు గలవు. అవి 1. పగలు - రాత్రి (ఆవర్తన కాలము - ఒకరోజు) 2. శుక్ల పక్షము - కృష్ణ పక్షము (ఆవర్తన కాలము - ఒక నెల), 3. ఉత్తరాయణము - దక్షిణాయనము (ఆవర్తన కాలం - ఒక సంవత్సరం), 4. ఉదయ కల్పము - క్షయకల్పము.

(ఆవర్తన కాలం - 2 × 365 × 432000 × 71 × 14 - 31346784000 మానవ సంవత్సరములు)

ఆవర్తన ధర్మము గలిగి యుండుట శ్రుతి లక్షణము. సృష్టి గానములో ఇట్టి శ్రుతి లక్షణమును మన భారతీయ ఋషులు స్పష్టముగా గుర్తించిరి. శ్రుతి లయాత్మక లక్షణము విశ్వ సృష్టికి తల్లిదండ్రుల వంటిది. జ్యోతిశ్శాస్త్రములో ఈ తల్లిదండ్రులకు వరుసగా చంద్రుడు - సూర్యుడు సామ్యములు, ప్రతీకలు - (Symbolic indicators). ఈ సూర్యచంద్ర గోళములు చూచుటకు - భజన చేయుటకు ఉపయోగించు రెండు తాళపు చిప్పల వలె నుండును. భజనలో తాళమును వేయునపుడు తాళపు

చిప్పలు ఏ విధముగా దగ్గఱకు వచ్చుచూ - దూరముగా పోవుచూ ఉండునో అదే విధముగా సూర్య చంద్ర గోళములు కూడా కాలగమనములో ఏకాంతరముగా దగ్గఱకు వచ్చుచు - దూరముగా పోవుచూ ఉండును. సూర్య చంద్రుల ఇట్టి సాపేక్ష గమనము (Relative motion) వలననే సృష్టికి ఒక శ్రుతి లయబద్ధమైన లక్షణము ఏర్పడుచున్నది. సూర్యచంద్రులు దగ్గఱగా వచ్చుటనే జ్యోతిశ్శాస్త్రములో సూర్య చంద్రుల మధ్య 'సమాగమ దృష్టి' (Conjunction of sun and moon) అందురు. ఇదియే ప్రళయమునకు సంకేతమైన అమావాస్య. సూర్య చంద్రులు దూరముగా పోవుటను సూర్యచంద్రుల మధ్య 'సమసప్తక దృష్టి' (Sun opposition Moon) అందురు. ఇదియే సృష్టికి సంకేతమైన పూర్ణిమ. భూమి సూర్యుని చుట్టును ఒక భ్రమణము పూర్తి చేయు లోపల, అనగా - ఒక మానవ సంవత్సరములో సూర్యచంద్రులు 12 సార్లు దగ్గరకు వచ్చుట, 12 సార్లు దూరముగా పోవుట అనగా 12 అమావాస్యలు 12 పూర్ణిమలు మొత్తము 24 అగును. ఇవియే ఒక సంవత్సరములో 24 అర్ధ మాసములు లేక పక్షములు. (సూర్యుడు మన ఆత్మకు, చంద్రుడు మన మనస్సుకు, భూమి మన దేహమునకు ప్రతీకలు. భూమి సూర్యుని చుట్టును తాను ఒక భ్రమణము పూర్తి చేయు లోపల సూర్యచంద్రులు 12 సార్లు దగ్గఱకు వచ్చుచూ, 12 సార్లు దూరముగా పోవుచుందురు. అనగా, మన దేహము ఒక్కసారి ఆత్మ చుట్టు తాను ప్రదక్షిణము చేయు లోపల - మన ఆత్మ మనస్సులు 12 సార్లు దగ్గఱకు వచ్చి 12 సార్లు దూరముగా పోవుట జరుగును అని గూడా తెలుసుకొనవలెను.

యజుర్వేదమునకు బ్రాహ్మణము (Commentary) అయిన శతపథ బ్రాహ్మ ణములో 14వ కాండలో 8వ అధ్యాయములోని 15వ బ్రాహ్మణములో ఈ గాయత్రీ మంత్రము యొక్క వైశిష్ట్యము చెప్పబడినది. భోగ, మోక్ష, విద్యగా చెప్పబడినది. సంవత్సరమునకు 24 అర్ధమాసములు లేక పక్షములు అని చెప్పబడినది గదా ! ఇవి గాయత్రీ మంత్రమునకు 24 అక్షరములుగా తీసికొనబడినవి. సంవత్సరములో 3 కాలములు 1) వేసవికాలము, 2) వర్షాకాలము, 3) శీతాకాలము. దీని ననుసరించి గాయత్రీ ఛందస్సు గూడ 3 పాదములుగా విభజింపబడినది. ఒక్కొక్క పాదమునకు 8 అక్షరములు చొప్పున మూడు పాదములకు 3 × 8 = 24 అక్షరములు.

## గాయత్రీ మంత్ర విభజన

గాయత్రీ మంత్రమును ఈ క్రింద తెలిపిన విధముగా విభజన చేసినచో అర్థ వివరణము సుకరమగును.

1. ఓం

2. భూః, భువః, సువః।

3. ఓం తత్సవితుర్వరేణ్యమ్ । భర్గోదేవస్య ధీమహి ।
ధియో యోనః ప్రచోదయాత్ ।

1) ముందుగా అ + ఉ + మ అను మూడు అక్షరములు కలిపి వున్న ప్రణవ సంకేత ఏకాక్షరము; 2) తరువాత ఈ ఏకాక్షరములో ఇమిడి

వుండి, విచ్చుకొను మూడు అక్షరములకు ప్రతీకలుగా గలిగిన మూడు వ్యాహృతులను తెలుపు పదములు; 3) ఆ తరువాత ఈమూడు పదములు మరింత విచ్చుకొనినట్లు మూడు పాదములు. ఈ విధముగా విభజన చేయవలెను.

## ప్రణవము

ప్ర + నవ = ప్రణవ - ప్ర - అనగా ప్రారంభము లేదా ప్రథమ లేదా ఒకటి. నవ - అనగా తొమ్మిది; మరియు ప్ర - అనగా ప్రాత, నవ - అనగా క్రొత్త అని అర్థములు చెప్పుకొనవచ్చును. 1 నుండి 9 వరకువిచ్చుకొను గుణము ప్రణవ పదములో గలదు లేదా "ప్రాచీనము నుండి నవీనము వరకు" అను అర్థము ప్రణవ పదములో గలదు. అనగా సంఖ్యాత్మకముగాను ఆవరణాత్మకము గాను విచ్చుకొను గుణము ఈ "ఓం" అక్షరములో గలదు. అందుచేతనే భగవద్గీతలో "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని గీతాచార్యునిచే సూచింపబడినది. 'బృహ్మణము' అనగా విచ్చుకొనుట. సృష్టిగా విచ్చుకొను వాడు గాబట్టి సృష్టికర్తకు 'బ్రహ్మ' అను పేరు వచ్చినది. అట్లే, విచ్చుకొను గుణము నిక్షిప్తమై వున్నది గాబట్టి 'ఓం' గూడా బృహ్మణతత్వము గలిగినదై "ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ" అని గీతాచార్యునిచే సూచింపబడినది.

'ఓం' అక్షరములోని అ, ఉ, మ అను మూడు అక్షరములు వరుసగా అధోలోక, ఊర్ధ్వలోక, మధ్యలోకములను సూచించును. వీటినే ప్రతి మానవునిలో పాతాళ లేదా రాక్షసలోకము (నాభికి దిగువ భాగము),

దేవలోకము (కంఠము నుండి పైన వుండు శిరోభాగము) మధ్య లేక మర్త్యలోకము (కంఠమునకు నాభికి మధ్య వుండు భాగము)లుగా సూచించు సంప్రదాయము గలదు. వీటినే పరమాణు (Atom), పరమాత్మ (Cosmic Purusha), ప్రాణి (Living being) లకు ప్రతీకలుగా గూడ వ్యవహరించవచ్చును. మరియు వీటిని వరుసగా స్థూల, కారణ, సూక్ష్మ లోకములకు ప్రతీకలుగా గూడ సమన్వయ పరచుకొనవచ్చును.

ఏకాక్షరమైన 'ఓం' లోని మూడు అక్షరములు అయిన - అ, ఉ, మ-లు మరల ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క పదము చొప్పున మూడు పదములుగా విచ్చుకొనగా మూడు వ్యాహృతులైన 'భూః', 'భువః', 'సువః' వచ్చినవి. భూలోకము - అధోలోకమును; సువర్లోకము - ఊర్ధ్వలోకమును; భువర్లోకము - మధ్యలోకమును సూచించును. ఈ మూడు వ్యాహృతుల, మూడు లోకముల, వాటి అధిష్ఠానదేవతల గురించి తరువాత మరింత వివరించబడును.

మూడు వ్యాహృతుల పదములు తరువాత మూడు పాద ములుగా విచ్చుకొని గాయత్రీ మంత్ర ప్రధాన భాగమును ఏర్పరచును.

## వ్యాహృతుల వివరణము

1. "భూరితివా అయమ్ లోకః, భువ ఇత్యంతరిక్షమ్, సువరిత్య సౌలోకః" - తైత్తిరీయం - శిక్షావల్లి.

పైన చెప్పిన ఋక్కునందు 3 లోకముల గురించి చెప్పబడినది.

1) భూలోకము 2) భువర్లోకము 3) సువర్లోకము. గాయత్రీ మంత్రమును మూడు పాదములుగా విభజించినపుడు వానిని క్రమముగా ఈ మూడు లోకములతోను సమన్వయ పరచి ధ్యానము చేయవలెను. అనగా, మొదటి పాదమును భూలోక సమన్వయముతో - అనగా, భౌతిక సృష్టి రూపమున ధ్యానము చేయవలెను. అనగా, ద్రవ్య మయాత్మక సృష్టి రూపమున ధ్యానము చేయవలెను. రెండవ పాదమును భువర్లోకముతో సమన్వయ పరచి శక్తిమయాత్మక రూపమున ధ్యానము చేయవలెను. ఇక మూడవ పాదమును సువర్లోకముతో సమన్వయుపరచి ప్రజ్ఞామయాత్మక సృష్టి రూపమున ధ్యానము చేయవలయును. ఈ మూడు లోకములను ఆంగ్లమున 1) Plane of materialisation or preciptiation అనియు 2) Plane of Vibration అనియు 3) Plane of radiation or Light or Consciousness అనియు వరుసగా వ్యవహరింతురు. ఈ విధమైన ధ్యానము వలన ధ్యానించు వానికి ఈ మూడు లోకముల పైన స్వామిత్వము కలుగును.

ప్రధాన కారణము (Primary or First cause) నుండి సూక్ష్మమునకు (Subtle), సూక్ష్మము నుండి స్థూలమునకు జగత్తు ఏర్పడుచున్నది. ఈ మూడు స్థాయిలను వరుసగా 1) ప్రజ్ఞ 2) శక్తి 3) ద్రవ్యము అనవచ్చును. స్థూలము నుండి సూక్ష్మమునకు చూచినచో అనగా కార్యము నుండి కారణము వైపునకు చూచినచో - అనగా, మనము ఎరిగి యున్న దాని నుండి ఎరుగవలసిన దాని వైపుగా చూచినచో - పైన చెప్పిన వరుస తలక్రిందులగును. అనగా ముందు ద్రవ్యము, అటుపైన

శక్తి, ఆ పైన ప్రజ్ఞగా వరుస మారును. ఈ విధముగా ధ్యానము చేసినపుడు ముందు ద్రవ్యాత్మక లోకమునకు అధిష్ఠాన దేవతలయిన అష్ట వసువుల యొక్క అనుగ్రహము కలుగును. అటుపైన శక్తి మయాత్మక లోకమునకు అధిష్ఠాన దేవతలయిన ఏకాదశ రుద్రుల యొక్క అనుగ్రహము కలుగును. ఆ పైన ప్రజ్ఞామయాత్మక లోకమునకు అధిష్ఠాన దేవతలయిన ద్వాదశ ఆదిత్యుల అనుగ్రహము కలుగును. అప్పుడు ఈ మూడు లోకములపై స్వామిత్వము సిద్ధించును. (పైన చెప్పిన మూడు లోకముల అధిష్ఠాన దేవతలు ఒకరి కంటె ఒకరు సూక్ష్మతర దేవతలు. శక్త్యాత్మక లోకము - ద్రవ్యమునకు ప్రజ్ఞకు మధ్యగా నుండుటచే దీనిని అంతరిక్ష లోకము (Intermediate Plane) అని కూడా అందురు. మరియు ఈ అంతరిక్ష లోకమునే రుద్రలోకము అని కూడ వ్యవహరింతురు. ఇది స్పందనాత్మకము. అందువలన దీనిని ఆంగ్లమున (Plane of Vibration) అని అనవచ్చును. ఈ స్పందనము వలననే ప్రజ్ఞ చైతన్యవంతమై ద్రవ్యమునకు దారితీయును. "Space pulsates". అనునది ఆధునిక విజ్ఞానశాస్త్ర సిద్ధాంతము. ప్రజ్ఞచే ఏకాంతర రీతిని (Process of alternation) జరుగు హృదయ స్పందనము వలన శ్వాసకోశము ప్రచోదితమై ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసములు పుట్టి, జీవి యొక్క జీవన వ్యాపారము కొనసాగుచున్నది. ఇప్పుడు చెప్పినది బ్రహ్మాండ సృష్టికిని, పిండాండ సృష్టికిని మూల సూత్రము. దీనినే పైథాగరస్ మహాశయుడు "As above so below" అను చిన్న పదములతో ఆంగ్లమున చెప్పినాడు.

2. "భూరితివా ఋచః, భువరితిసామాని. సువరితి యజూగ్ంషి"

- తైత్తిరీయం - శిక్షావల్లి.

పైన చెప్పబడిన ఋక్కును బట్టి మూడు లోకములను ఋక్సామ యజుర్వేదములుగా సమన్వయ పరచుకొనవలయును. మరియు "వాగేవఋక్" అను దానిని బట్టి ఋగ్వేదమును కంఠము నందలి వాక్కుగాను, "ప్రాణస్సామవేదః" అను దానిని బట్టి సామవేదమును శ్వాసగను, "యజ్ఞో యజుర్వేదః" అను దానిని బట్టి యజుర్వేదమును కర్మాచరణముగను - సమన్వయ పరచుకొనవలయును. ఇంతకు ముందు ఉదహరించిన వ్యాహృతులను బట్ట గాయత్రీ మంత్రములోని మూడు పాదములను వరుసగా ఋక్సామ యజుర్వేదములుగ ధ్యానము చేయవలయును. ఈ ధ్యానమువలన ధ్యానించు వానికి త్రయీ విద్యపై స్వామిత్వము కలుగును.

3. "భూరితివై ప్రాణః, భువరిత్యపానః, సువరితివ్యానః" తైత్తిరీయమ్ - శిక్షావల్లి.

పైన చెప్పబడిన ఋక్కును బట్టి మూడు లోకములను ప్రాణ, అపాన - వ్యానములుగా సమన్వయ పరచుకొనవలయును. ఉచ్ఛ్వాసము ప్రాణము అనబడును. (Force of attraction or receiving faculty) నిశ్వాసము - అపానము అనబడును. (Force of repulsion or releasing or outgoing faculty) దేహము నందు వ్యాపించు చైతన్య రూపమగు ప్రాణము - వ్యాన మనబడును. (Force of distribution or permiating faculty). ఇంతకు ముందు ఉదహరించిన వ్యాహృతులను

బట్టి గాయత్రి మూడు పాదములను ప్రాణ, అపాన, వ్యానములుగ ధ్యానము చేయవలయును. దీని వలన ధ్యానించు వానికి ప్రాణ ప్రవృత్తులపై స్వామిత్వము కలుగును.

4. "భూరితివా అగ్నిః, భువ ఇతి వాయుః, సువరిత్యాదిత్యః।" తైత్తిరీయమ్ - శిక్షావల్లి.

పైన చెప్పబడిన ఋక్కును బట్టి మూడు లోకములను అగ్ని, వాయువు, ఆదిత్యులుగా సమన్వయ పరచుకొనవలయును. మరియు, ముందు ఉదహరించిన వ్యాహృతులను బట్టి గాయత్రి మూడు పాదములను వరుసగా అగ్నితోను, వాయువుతోను, ఆదిత్యునితోను, సమన్వయపరచి ధ్యానము చేయవలయును. ఈ విధమైన ధ్యానము వలన ముగ్గురు అధిష్ఠాన దేవతల అనుగ్రహము, అటుపైన వారిపై స్వామిత్వము కలుగును.

## నాల్గవ పాద ప్రసక్తి

గాయత్రీ మంత్రమును పైన చెప్పిన విధముగా మూడు పాదములు ధ్యానము చేయునపుడు ఈ మూడు లోకములకును, ధ్యానించు వానికిని వెనుక తెరవలె ఉండునట్టి అవ్యక్తమైన వెలుగు "తురీయ" మనబడును. 'తురీయము' అనగా నాల్గవది' అని అర్థము. ఈ మొదటి మూడు ధ్యానములపై స్వామిత్వము కలిగిన వెనుక వానినే తురీయము నందు సమర్పణము చేయవలయును. అదియే మోక్షస్థితి. అది అస్తిత్వము కన్న అతీతముగా ఉండును. అస్తిత్వము రజస్సుతో

కూడినది. ఈ తురీయము రజస్సు కన్న పరమైయుండును. గనుక, దానిని పరోరజము అందురు. దీనినే గాయత్రి యొక్క నాల్గవ పాదముగా "శతపథ బ్రాహ్మణము"లో వర్ణించుట జరిగినది. ఈ నాల్గవ పాదము గూడ 8 అక్షరములు కలది. పరో + రజసి + సౌ + అవతు + ఓం లేదా "పరోరజసిసావదోం" అనునది నాల్గవ పాదమగును. ఈ నాల్గవ పాదముతో కలిపిన గాయత్రీ మంత్రము మోక్ష జీవులచే ధ్యానము చేయబడుచుండును. ఇందు చెప్పిన తురీయమునే "దర్శనము" అని గూడా అందురు. అనగా ఈ ధ్యానములో దర్శించువాడు, దర్శించబడినది, ఏకమై ఒకేవెలుగుగా అనుభూతి యగును. దీనిని పొందిన వాడు యశస్సు, శ్రీ అనువానిపై గూడ స్వామిత్వము పొందును.

## ధ్యానరూప ప్రసక్తి

ఇతర మంత్రముల విషయములో ధ్యానము చేయుటకు ధ్యాన దేవతగా ఒక స్వరూపము చెప్పబడును. గాయత్రీ మంత్రము చేయునపుడు కొందరు "ముక్తావిద్రుమహేమనీల.... హస్తైర్వహంతీం భజే" అను శ్లోకములో వర్ణించినట్లు స్త్రీ రూప ధ్యానదేవతను, మరి కొందరు "ధ్యేయస్సదాసవితృ మండల మధ్యవర్తీ... శంఖ చక్రః" అను శ్లోకములో వర్ణించినట్లు పురుష రూపమైన సూర్యుని దేవతగను ధ్యానింతురు. విభేదములు చూడక సమన్వయమును చూచువారు రెండు శ్లోకములనూ ధ్యానమునకు ఉపయోగింతురు. మంత్రము గాయత్రీ ఛందస్సులో నుండుటచే గాయత్రికి స్త్రీ రూప ధ్యాన దేవతను,

మంత్రములో "సవితుర్వరేణ్యమ్" "యః" అనియు ఉండుటచే "సవితా" అనగా, సూర్యునిగా పురుష రూప దేవతను ఏర్పరచుట జరిగినది. కాని, నిజమునకు గాయత్రీ మంత్రమునకు ఒక నిర్దిష్ట ధ్యానరూపము లేదనియే చెప్పవలెను. అందువలననే ఈ మంత్రము ఇష్ట మతములతో గాని ఇష్ట దేవతలతో కాని, సంబంధము లేకుండా సర్వులకు నుపకరించు మంత్రము అయినది. (Impersonal and Universal).

## గాయత్రిలో సవితృమూర్తి

గాయత్రీ మంత్రమునకు సవితృమూర్తిని ధ్యానదేవతగా చేసుకొనుటలో గూడ చాల సమంజసము కలదు. మన ఉనికికి కారణమైనది భూమి. భూమి ఉనికికి కారణము గ్రహములతో కూడిన సూర్యుడు. సూర్య కుటుంబము యొక్క ఉనికికి కారణము సూర్యుడు. కాబట్టి, ఈ మొత్తము సూర్య కుటుంబము అంతయు సూర్యుని పైన ఆధారపడి యున్నది. అందుచేతనే సూర్యుడు 'మూల విరాట్' అగుచున్నాడు. ప్రజ్ఞా లోకములోని బుద్ధులను ప్రచోదనము చేయు సవితృమండల మూర్తిని వ్యక్తము చేయు భాస్కరుని అనుగ్రహముచే మనకందఱకు ప్రాణశక్తి, వృద్ధిశక్తి, బుద్ధిశక్తి మొదలైనవి పనిచేయుచున్నవి. సూర్య కుటుంబము లోని అన్ని రకముల జీవుల, జీవన శక్తులకు మూలభూతమైన శక్తి ఈ సూర్యునిదేనని విజ్ఞాన శాస్త్రము చెప్పుచున్నది. కేంద్రక మేళన ప్రక్రియ (Nuclear Fusion) వలన హైడ్రోజన్ పరమాణువులు - హీలియమ్ పరమాణువులుగ మారుటతో ఉద్భవించు

శక్తి సూర్యునిలోని శక్తిని తరుగకుండ చేయుచున్నదని కూడ శాస్త్రము చెప్పుచున్నది. ఈ సూర్యుని నుండి వచ్చు శక్తి అంతయూ అదుపులో ఉంచబడి యుండును. సూర్యుని ఉష్ణోగ్రత ఉన్నదాని కంటే ఒక శాతము పెరిగినచో సమస్త సూర్య కుటుంబము, మానవ కోటి బూడిద అయిపోవలసినదే ! లేదా ఒక శాతము తగ్గినచో సమస్త సూర్య కుటుంబము మంచు గడ్డ వలె ముద్ద కట్టుకు పోవలసినదే ! కాని, ఇటువంటి విపత్కర పరిస్థితులు రాకుండా సూర్యుని ఉష్ణోగ్రత అతి జాగ్రత్తగా నిర్దిష్టమైన, అవసరమైన విలువ వద్దనే ఉండుట చాల ఆశ్చర్యము. అది కేవలము తన కుటుంబము వారిపై ఆ సూర్యునికి గల వాత్సల్యము, అనుగ్రహము అని చెప్పవలయును. మరియొక సాంకేతిక కారణమును చెప్పగలిగినను, చెప్పలేకపోయినను కుటుంబ రక్షణ జరుగుచునే యున్నది కదా!

సూర్య గోళమును గూర్చి విజ్ఞానశాస్త్రము చాల విషయములు తెలియబరచును. కాని, ఈ సూర్యశక్తి భౌతిక జీవులకు మాత్రమే పరిమితము అని చెప్పుట విజ్ఞానశాస్త్ర పరిమితిని (Limitation) తెలియ జేయును. "నిజమునకు భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక కక్ష్యలలో గూడ ఈ సూర్యశక్తి వినియోగపడును" అని తపస్సాధన, యోగము ద్వారా భారతీయ ఋషులు తెలుసుకొనిరి. భౌతికముగా కనబడుసూర్య గోళములో నిక్షిప్తమై దృగ్గోచరము కాని లోకములు ఎన్నియో ఉన్నవి. ఈ గుప్త లోకములకన్నిటికి అధినాథుడైన వాడే "సూర్యాంతర్వర్తి లేక సూర్యనారాయణుడు" అని భారతీయుల సిద్ధాంతము. ఈ సూర్య

నారాయణుని గూర్చియే మహాసౌరము, ఆదిత్య హృదయము చెప్పును. ఈ విశ్వ ప్రజ్ఞ నుండి అన్ని రకముల లోకములు, శక్తులు, గుణములు వ్యక్తమగుచు లీనమగుచున్నవని తెలిసికొనవలయును. ఒక్క ముక్కలో చెప్పవలెనన్నచో మనము ఆయనలో పుట్టుచూ, పెరుగుచూ, జీవించుచూ చివరకు ఆయనలోనే లీనమయి పోవుచుంటిమి. కాబట్టి అటువంటి ప్రజ్ఞా మూల కేంద్రమునకు స్థావరమైన జ్ఞాన భాస్కరుని గాయత్రీ మంత్రములో "తత్ సవితుః" అనియు మరియు "యః" అని ఆ సవితకు సంబంధ వాచక సర్వనామమును (Relative Pronoun) తీసికొనుటయు ఎంతైనా మంజసము కదా!

## గాయత్రీ మంత్ర విభజన- శాస్త్రీయోదాహరణ

ప్రణవ వ్యాహృతులతో కూడిన గాయత్రీ మంత్రమును గూడ మూడు భాగములుగా విభజింపవచ్చును. మొదటి భాగములో కేవలము ప్రణవముతో కూడిన వ్యాహృతులు అనగా "ఓం భూర్భువస్సువః" వచ్చును రెండవ భాగములో "ఓం తత్ సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి" వచ్చును. మూడవ భాగములో "ధియో యోనః ప్రచోదయాత్" వచ్చును. ఈ విధమైన విభజన వలన మరియొక సమన్వయము సాధింపవచ్చును.

మొదటి భాగము వలన సాధకునిలో నిద్రాణమై యున్న దివ్యమైన శక్తులను రగుల్కొల్పుట జరుగును. మిగిలిన రెండు, మూడు భాగముల వలన సాధకుడు పొందవలసిన వాటికి తగిన పునాది ఈ మొదటిభాగము వలన వచ్చు శక్తి వలననే ఏర్పడును. ఈ శక్తి శబ్దము

ద్వారా ప్రచోదనము చేయబడును. ఈ ప్రచోదనకు - వ్యాహృతులకు ముందు ఉచ్చరించు ప్రణవము ప్రారంభమును, త్వరణ శక్తిని సమకూర్చును. ఈ ప్రణవము ఛందస్సులకు నాంది అని కాళిదాసు రఘు వంశములో గూడ వ్రాయును. (ప్రణవః ఛంద సామివ) ఛందస్సు గమనమును తెలుపునది. అట్టి ఛందస్సులకు నాంది ప్రణవము కనుక శబ్ద ప్రపంచమునకు గూడ ప్రణవము నాంది యగును. అన్ని శబ్దములు ఓంకారము నందు పుట్టి, ఓంకారము లోనికి లీనమగును. బైబిల్ గ్రంథము నందు గూడా First there was the word అని John's revelationలో వుండును. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని సృష్టి కర్తయైన బ్రహ్మను గూడ "ఓం"తో సమన్వయపరచుటలో సృష్టికి మూలము గూడ ఓంకారము అని తెలియును. మన శ్వాసలోని ఉచ్ఛ్వాస నిశ్వాసముల ద్వారా జరుగు అజపా గాయత్రి అనగా "సోஉహం"లో కూడా ఓంకారము నిక్షిప్తమై, జీవన వ్యాపారమునకు కారణభూతమగుచున్నది. పరమేశ్వరుని వ్యక్తపరచుటకు ఉపయోగించు పదము గూడ "ఓం" అను అక్షరమే (తస్యవాచకః ప్రణవః) అని పతంజలి మహర్షి తన యోగ శాస్త్రము నందు స్పష్టము చేసినాడు. ఇన్ని సమన్వయములను బట్టి గాయత్రీ మంత్రమునకు, వ్యాహృతులకు నాందిగ ఓంకారము చేర్చి ఉచ్చరించుట ఎంతయో శాస్త్రీయము, సమంజసము.

ఇక రెండవ భాగము - సూర్యాంతర్వర్తియైన నారాయణుని ప్రజ్ఞయందు మన ప్రజ్ఞ లీనమగుటకు తగిన, కావలసిన శక్తి సామర్థ్యములు పొందుటలో నుండవలసిన తపన, పట్టుదలలను కలుగ చేయును.

ఇక మూడవ భాగము వలన - సాధకుని జీవాత్మ పరమాత్మలోనికి లీనమగుట జరుగును. ఈ స్థితిలోనే ఆత్మ శరణాగతి సంపూర్ణముగా కలుగును. ఈ స్థితిలోనే తాను విశ్వములో ఒక విడి భాగముగా గుర్తుండడము గాక, తాను పరమాత్మలోనే అంతర్లీనమై యున్న అంశమనే అనుభూతిని ఆ పరమాత్మ అనుగ్రహము ద్వారా పొందుట జరుగును. అనగా ఇది తాదాత్మ్యమును, అద్వైత సిద్ధిని కలుగజేయు భాగము.

పైన చెప్పిన మూడు భాగములలో జరుగు మార్పులను ఈ క్రింది ఉదాహరణ ద్వారా అర్థము చేసుకొనవచ్చును.

ఒక విలుకాడు ధ్యేయమును గురి చూచి, బాణమును కొట్టి ప్రతిఫలముపొందు ప్రక్రియతో పైన ఉదహరించిన మూడు భాగములలో జరుగు మార్పులను సమన్వయ పరచుకొనవచ్చును.

మొదట విలుకాడు విల్లును చేతబట్టి, వంచి, దానికి నారిని సంధించుట జరుగును. అటుపైన వింటినారికి బాణమును బిగించి నారిని వీలైనంత వెనుకకు లాగుచు తగినంత తన్యతను (Tension) కలుగజేయును. ఆపైన బాణమును గురి చూచిన ధ్యేయము వైపునకు వదలుట జరుగును. ఈమూడు భాగములలో మొదట తను కొట్టుటకు కావలసిన పరిస్థితికి విల్లును తెచ్చుట జరుగును. గాయత్రీ మొదటి భాగములో గూడ ఇటువంటి ప్రయత్నమే జరుగును.

ఇక రెండవ భాగములో - వింటి యందు, నారి యందు తగినంత స్థితి శక్తిని (Potential energy) తనలో నుండి వెచ్చించును. ఈ ప్రయత్నము కేవలము తన శక్తి మీదనే ఆధారపడి యుండును. ఇది మానవ ప్రయత్నము వంటిది. గాయత్రి రెండవ భాగములో కూడ ఇటువంటి ప్రయత్నమే జరుగును. ఇక మూడవ భాగములో ఎక్కు పెట్టిన బాణము ధ్యేయములో చేరిపోవును. ఇట్లు జరుగుటలో నిక్షిప్తమై యున్న స్థితిశక్తి (Potential energy) అంతయు గతి శక్తిగా (Kinetic energy) మారి ధ్యేయమును చేరును. ఈ ప్రయత్నము సాధకుని శక్తితో ప్రమేయము లేదు. ఇది దైవానుగ్రహము. మార్గమధ్యములో అవ రోధములు లేకుండా చేయుట దైవానుగ్రహమే కాని మానవ ప్రయత్నమునకు సంబంధించిన విషయము కాదు. అట్టి దైవానుగ్రహము కలసి వచ్చినపుడు బాణము దానంతటది ధ్యేయమును చేరును. గాయత్రి మూడవ భాగములో కూడా ఇటువంటి ప్రయత్నమే జరిగి ప్రతిఫలమును సాధకుడు పొందును.

## మానవ ప్రయత్నము - దైవానుగ్రహము

సాధారణముగా ఒక పని జరుగవలెనన్నచో మానవ ప్రయత్నము దైవానుగ్రహము రెండును కలసి రావలయునని అందురు. కాని, కొందరు పూర్తిగా మానవ ప్రయత్నము పైనను, మరి కొందరు దైవానుగ్రహము పైనను నమ్మకము గలిగి యుందురు.

"అంతా వాడిలీల. మన దేమియును లేదు" అని పని

జరుగుటకు తమ వంతు మానవ ప్రయత్నమునుగూడ చెయ్యని వారుందురు. వీరిని వేదాంతులనుట కంటే మెట్ట వేదాంతులనుట శ్రేయస్కరము. వీరిని - చేయవలసిన పనిని ఎగగొట్టువారు (Escap-ists) అలసులు, సోమరులు అని అనవచ్చును. ఇటువంటివారు సంకల్ప, క్రియాశూన్యులు. జాతి పురోగమించుటకు అవసరమగు ప్రయత్నము ఇటువంటి వారి వలన జరుగదు. ఇదే మెట్టవేదాంతి ఇదే విధముగా మానవ ప్రయత్నము అనవసరమని చెప్పుచున్నపుడు ఎదురుగా కొండి ఎత్తుకొని తన వైపునకు తేలు వచ్చుచున్నచో ప్రక్కకు తప్పుకొను మానవ ప్రయత్నము చేసి తీరునే గాని, "తేలు కుట్టాలనిఉంటే కుడుతుంది. విషం ఎక్కాలనిఉంటే ఎక్కుతుంది. అంతా వాడిలీల" అని చెప్పి అక్కడే స్థిరముగా వుండడు. అనగా ఆ మెట్ట వేదాంతి చెప్పునది - ఇతరులకే సలహాగాని, తన స్వంత వ్యవహారమునకు గాదని తెలియుచున్నది.

కొందరు పూర్తిగా మానవ ప్రయత్నము మీదనే నమ్మకమును కలిగి యుందురు. అదియును అంత సమంజసము కాదు. పది ఎకరాల పొలమును వళ్ళు వంచి, దున్ని, సాగుచేసి, నారు నాటి, ఎరువువేసి మానవ ప్రయత్నములో లోపము లేకుండా చేసినను వర్షాలు పడకపోయినచో ఆ మానవ ప్రయత్నము వల్ల పంట పండదు, చేతికి రాదు. ఆ వర్షాలు పడటమే - దైవానుగ్రహము, అలా అని - దున్ని సాగుచేసి, నారు నాటక పోయినపుడు వర్షము ఎంత పడిననూ పొలము పండదు, పంటరాదు. అనగా దైవానుగ్రహము ఉన్ననూ, మానవ ప్రయత్న లోపము వలన పంట పండలేదు. కాబట్టి, ఈ ఉదాహరణ వలన "మానవ ప్రయత్నము,

దైవానుగ్రహము రెండును కలిసి రావలయు ననుట సమంజసము'' ఈ విషయము గాయత్రీ మంత్రములో గూడా సూచన ప్రాయముగా గలదు.

గాయత్రీ మంత్రములోని - "తత్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి'' అనగా (మా ప్రయత్నముగా) సవితృమూర్తి యొక్క దివ్యమైన తెల్లని తేజస్సును మేము ధ్యానించుచున్నాము'' అనెడి మానవ ప్రయత్న ఆవశ్యకతా సూచన ఉన్నది. "ధియో యోనః ప్రచోదయాత్'' అను భాగములో - మా బుద్ధులను ఆ సవితృమూర్తి ప్రచోదనము చేయు గాక! అనెడి దైవానుగ్రహ ఆవశ్యకతా సూచన వున్నది అని తెలుసు కొనవలెను. ఈ మానవ ప్రయత్న, దైవానుగ్రహములు వరుసగా జ్ఞాన మార్గ, భక్తి మార్గ పద్ధతులను గూడా సూచించును. జ్ఞాన మార్గములో ఉపాసకుడు దేవుని అన్వేషించుచు పోవును. బాధ్యతాయుత ప్రయత్న మంతయు ఉపాసకునిదే ! ఇది మర్కట కిశోర న్యాయము వంటిది. (తల్లి కోతి ఒక కొమ్మ నుండి వేరొక కొమ్మకు ఎగురుతూ దూకునపుడు తల్లిని పట్టుకొని తల్లి పొట్ట క్రిందుగా పిల్ల కోతి వుండును. దూకునపుడు పడిపోకుండా చూచుకొనవలసిన బాధ్యత పిల్ల కోతిదే గాని తల్లి కోతిది కాదు. దీనిని 'మర్కట కిశోర న్యాయ'మందురు.) భక్తి మార్గములో భక్తుడు పూర్తి బాధ్యతను దేవుని పైననే వేయును. తాను శరణాగతి చెందును. ఈ మార్గములో - బాధ్యతదైవమునకే ఎక్కువ. ఇది మార్జాల కిశోర న్యాయము వంటిది. (తల్లి పిల్లి తన పిల్లను నోటకరచుకొని వేరు వేరు చోట్లకు పోవునపుడు దాని కోరలు గ్రుచ్చు కొనకుండ, క్రింద పడి పోకుండ చూచు కొనవలసిన పూర్తి బాధ్యత తల్లి పిల్లిదే గాని పిల్లది గాదు. దీనిని

మార్జాల కిశోర న్యాయమందురు). ఈ రెంటినీ అనగా - జ్ఞాన మార్గ, భక్తి మార్గములను, మానవ ప్రయత్న, దైవానుగ్రహముల ఆవశ్యకతను, సమన్వయమును సూచించు మంత్రమే - గాయత్రీ మంత్రము.

## కొన్ని సందేహములు

1. **గాయత్రీ మంత్రమును బాహాటముగా గొంతెత్తి ఉచ్చరించవచ్చునా?**

సమాధానము : "గాయంతాం త్రాయతే - ఇతి గాయత్రి" అనగా పాడిన కొలది రక్షించు మంత్రము గాయత్రి అని నిర్వచనములోనే ఉండగా ఈ సందేహము కలుగవలసిన పనిలేదు. మరియు, గాయత్రి వేదములోని మంత్రము. వేదమంతయు స్వరయుక్తము. బయటకు ఉచ్చరించినపుడే స్వర భేదము స్ఫుటముగా తెలియును గాని, లోపల నసిగినపుడు, గొణిగినపుడు కాదు. అందుచేతనే స్వరయుక్త మంత్రములన్నియు బయటకు ఉచ్చరించుట తప్పుకాదు.

2. **అందఱూ కలసి సామూహికముగా ఉచ్చరించవచ్చునా ?**

సమాధానము : "ధియోయోనః ప్రచోదయాత్" అనుటలో "ధియః" అనగా బుద్ధులు అని, "నః" అనగా "మమ్ము" లేదా "మా యొక్క" అను పదములతో బహువచనములు ఉండగా అందరూ కలసి చేయవచ్చుననియే తెలుపును గదా!

3. **ఈ ఉపదేశము ఎప్పుడు జరుగవలెను ?**

సమాధానము : ఏ విద్యనైనను, ఏ మంత్రము నైనను నేర్చుకొనవలెనని అభిలాష, శ్రద్ధ, పట్టుదల కలిగిన వారు వాటిని చేర్చుకొనుటకు అర్హులే. ఆసక్తి, శ్రద్ధ కలుగుట అనగా బుద్ధి దానిపట్ల ప్రచోదనమగుట అనియే కదా! నిజమునకు ఆ మంత్రమును

నేర్చుకొనవలెనని బుద్ధి పుట్టినపుడు మంత్రోపదేశము (Initiation) జరిగినట్లు లెక్క. ఆ తరువాత భౌతికముగా గురువు వద్ద ఉపదేశము పొందుట దానిని సమర్థించుచు (Ratify) చేయు ప్రక్రియయే !

4. వేరువేరు వర్ణములకు వేరు వేరు గాయత్రీ మంత్రములు వున్నవా?

సమాధానము : అన్ని వర్ణములవారు గాయత్రిని చేసుకొనవచ్చును. ఆ మంత్రమును చేయుట తప్పనుకొనువారికి - వేరు, వేరు గాయత్రీ మంత్రములు గూడ కలవు. బ్రాహ్మణులకు అనుష్టుప్ ఛందస్సులో పై మంత్రము ఈయబడినది. (అనుష్టుప్ అనగా 8 అక్షరముల ఛందస్సు. అందుకే బ్రాహ్మణులకు ఉపనయనము 8వ ఏట). క్షత్రియులకు త్రిష్టుప్ ఛందస్సులో ఈ క్రింది మంత్రము ఈయబడినది. (త్రిష్టుప్ 11 అక్షరముల ఛందస్సు, క్షత్రియులకు 11వ ఏట ఉపనయనము జరుపుట అందుకే.)

"ఓం దేవస్య సవితుర్మతి మానవం
విశ్వ దేవ్యం । ధియా భగం మనామహే ।"

జగతీ ఛందస్సులో వైశ్యులకు ఈ క్రింది మంత్రము ఈయబడినది (జగతీ ఛందస్సులో 12 అక్షరములుండును. వైశ్యులకు 12వ ఏట ఉపనయనము అని సూచితము.)

"ఓం విశ్వా రూపాణి ప్రతిముంచతే కవిః
ప్రాసావిద్ భద్రం ద్విపదే చతుష్పదే
వినాకమఖ్యత్ సవితా వరేణ్యో
ను ప్రయాణ ముషసోవిరాజతి॥"

శూద్రులు ఏ మంత్రమును చేయకయే ఆజన్మశుద్ధులు అని "శూద్రస్తు జన్మతో ముక్తః" అన్నది తెలియ జేయును.

5. స్త్రీలు యీ మంత్రమును పఠించవచ్చునా ?

సమాధానము : స్త్రీ, పురుషులందఱూ జీవాత్మలే ! అనగా జీవాత్మకు లింగభేదము లేదు. మైత్రేయి, గార్గి, అనసూయ మొదలగు వారు వేద శాస్త్రాదులు చదివిన వారే ! గాయత్రీ మంత్రమును జపించిన వారే ! చేయు పద్ధతిలో స్వల్ప భేదము ఉండునేమో గాని, సంధ్యా వందనము గూడ స్త్రీలకు నిషిద్ధము కాదు.

ఈ పుస్తక రచనకు ముందు పరిశీలించిన గ్రంథములు :

1. శతపథ బ్రాహ్మణము
2. రుద్ర సూక్తము
   By శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య, W.T.T, ప్రచురణ.
3. గాయత్రి
   By ఐ.కె.టైమ్ని
   థియోసాఫికల్ సొసైటీ పబ్లిషింగ్ హౌస్, అడయార్,
   మద్రాసు - 20
4. ఉభయ గాయత్రీ తత్వవాదము
   By శ్రీ మున్నంగి పున్నయ్య పంతులు గారు

పై గ్రంథ ప్రచురణ కర్తలకు, గ్రంథ కర్తలకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

# అనుబంధము

గాయత్రీ మంత్రమును ప్రార్థన, పూజా సమయములందు స్వరయుక్తముగా గానము చేసుకొనదలచిన వారికి ధ్యాన శ్లోకములు వాటి తాత్పర్యములు, స్వరయుక్త గాయత్రీ మంత్రము ఈ క్రింద ఈయబడినవి.

## 1. ధ్యాన శ్లోకము

శ్లో.ముక్తా విద్రుమహేమ నీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీ క్షణైః
యుక్తా మిందు నిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థ వర్ణాత్మికామ్,
గాయత్రీం వరదా భయాంకుశ కశాశ్శుభ్రం కపాలం గదాం
శంఖం చక్ర మధార వింద యుగళం హస్తైర్వహంతీం భజే.

**తాత్పర్యము :** ముత్యపు వర్ణము, పగడపు వర్ణము, బంగారు వర్ణము, నీలవర్ణము, తెల్లని వర్ణముల గల ఐదు ముఖములు కల్గినట్టియు, ప్రతి ముఖమునకు మూడునేత్రములు కలదియు; చంద్రకళతో కూడిన కిరీటము కలదియు; పరమార్థ వివరణాత్మక బీజాక్షరములు కలదియు; వరద, అభయ ముద్రలు, అంకుశము, కొరడా, స్వచ్ఛమైన కపాలము. గద, శంఖము, చక్రము, రెండు పద్మములను (పది హస్తముల యందు) ధరించునదియునైన గాయత్రీ దేవిని సేవించెదను.

ఈ "ముక్తా విద్రుమహేమనీల ధవళచ్ఛాయైర్ముఖైః...."

శ్లోకము నందలి గాయత్రీ విగ్రహ వర్ణనలో చెప్పబడిన పంచ వర్ణముల పంచ ముఖములు వరుసగా ఈ క్రింది పట్టికలో తెలుపబడిన విధముగా పంచ అధిష్ఠాన దేవతలకు, పంచ భూతములకు, పంచ తన్మాత్రలకు ప్రతీకలుగా సమన్వయ పరచుకొనినచో గాణాపత్య, సౌర, శాక్తేయ, శైవ, వైష్ణవులకు మధ్య ఒక విధమైన సమన్వయమును సాధింపజేసి పరస్పర విద్వేషమును తొలగించవచ్చును.

| ధ్యానశ్లోకములో గాయత్రీ ముఖ ముల రంగులు | అధిదేవత | తన్మాత్ర | పంచభూతం |
|---|---|---|---|
| 1. ముక్తా (ముత్యంరంగు) | గణపతి | రసము | అపస్సు |
| 2. విద్రుమ (పగడం రంగు) | శక్తి | రూపము | తేజస్సు |
| 3. హేమ (బంగారు రంగు) | సూర్యుడు | స్పర్శము | వాయువు |
| 4. నీల (నీలం లేదా ఆకాశ రంగు) | విష్ణువు | శబ్దము | ఆకాశము |
| 5. ధవళ (తెలుపు రంగు) | శివుడు | గంధము | పృథివి |

గాయత్రీ మాతను దర్శించునపుడు వారి వారి అధిష్ఠాన దేవతా ముఖములు గూడా గాయత్రీ విగ్రహములో నున్నవి కాబట్టి, ఆ విగ్రహ ఆరాధనకు, అర్చనకు - ఐదు రకముల ఆరాధకులకు అభ్యంతరము వుండదు. ఈ కారణము వలననే గాయత్రీ మాత అందరికిని ఆరాధనీయురాలైనది.

## 2. ధ్యాన శ్లోకము

శ్లో.ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః ।
కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః ॥

**తాత్పర్యము** : సవితృ మండల అంతరము నందు వర్తించు వాడును; పద్మాసనాసీనుడై సన్నిధిని ప్రసాదించు వాడును; కేయూర, మకర, కుండల, కిరీట, హారములను కలిగి బంగారు రంగు శరీరము కల్గినవాడును; శంఖ, చక్రములను ధరించినవాడును - ఐన సూర్య నారాయణ మూర్తి ఎల్లప్పుడు ధ్యానించదగినవాడు.

(అనగా, అట్టి మూర్తిని ధ్యానింతును అని భావము.)

## స్వరయుక్త గాయత్రీ మంత్రము

ఓం భూర్భువస్సువః । ఓం తత్స వితుర్వరేణ్యమ్ ।

భర్గో దేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ ॥

## గాయత్రీ మంత్రపద విభాగము

ఓం, తత్, సవితుః, వరేణ్యమ్, భర్గః, దేవస్య.
ధీమహి, ధియః, యః, నః, ప్రచోదయాత్.

## పదక్రమము

వరేణ్యమ్, నః, ధియః, ప్రచోదయాత్ యః
తత్, ఓం సవితుః, దేవస్య, భర్గః, ధీమహి.

| | | |
|---|---|---|
| వరేణ్యమ్ | = | (అందరికినీ శ్రేయస్సును కలుగజేయుటలో) కోరదగినదియు |
| నః | = | మన |
| ధియః | = | బుద్ధులను |
| ప్రచోదయాత్ | = | ప్రేరేపించునదియు |
| యః | = | ఎవరో |
| ఓం | = | ప్రణవ ప్రతీకమైన |
| తత్ | = | ఆ |
| సవితుఃదేవస్య | - | వెలుగుల సవితృమూర్తి యొక్క |

భర్గః = (స్వయంప్రకాశ ప్రాసర గుణ సమన్వితమైన) తేజస్సును

ధీమహి = ధ్యానించుదము (గాక)

తాత్పర్యము : అందరికిని శ్రేయస్సును కలుగజేయుటలో కోరదగినదియు, మన బుద్ధులను ప్రేరేపించునదియు ఎవరో - ప్రణవ ప్రతీకమైన ఆ వెలుగుల సవితృమూర్తి యొక్క (స్వయం ప్రకాశ ప్రసార గుణ సమన్వితమైన) తేజస్సును ధ్యానించెదము (గాక!) (ఈ గాయత్రీ మంత్రమునకు బహువచనములోనే గాక ఏకవచనములో గూడా అర్థ తాత్పర్యాదులు చెప్పుకొనవచ్చును.)

ఇది ఒక వర్గమునకు, వర్ణమునకు, కులమునకు, మతమునకు, జాతికి, సంబంధించిన మంత్రము కాదనియు, సమస్త మానవాళి శ్రేయస్సును కోరు సహృదయులందరూ ఈ మంత్రమును ఒంటిరిగానైననూ, సామూహికముగా నైననూ ఉచ్చరించవచ్చుననియు ఈ మంత్ర తాత్పర్యమును బట్టి తేట తెల్లమగుచున్నది. ఇది సూర్యుని నుండి సౌరశక్తిని సూటిగా పొందుటకు భారతీయ ఋషులు దర్శించిన మంత్రము. భారతీయుల ప్రార్థనలు, మంత్రములు అన్నియు ఇదే విధముగా స్వార్థ రహితముగా సర్వజన శ్రేయోదాయకములుగా ఉండునని గ్రహించవలెను.

లోకాస్సమస్తాః సుఖినోభవన్తు ! ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః,

(సర్వలోక జీవులకు సుఖశాంతులు కలుగుగాక!)

**హరిః ఓం తత్సత్**

**శ్రీ కృష్ణార్పణమస్తు**